శ్రీ

శ్రీమతే రామానుజాయ నమః.

# నిత్యానుసన్ధానము.

## రెండవ భాగము.

తొండరడిప్పొడియాళ్వార్లు అనతిచ్చిన

వేదార్థసారమైన

# తిరుప్పళ్లియెఴుచ్చి.

వీటికి

పూర్వాచార్యులు అనతిచ్చిన వ్యాఖ్యానమునకు తగిన

ప్రతిపద, తాత్పర్య, విశేషార్థమున్ను, సంస్కృతప్రతికృతిశ్లోకములున్ను.

విద్వాంసులైన

చెన్నపురి వెస్లియన్‌మిషన్ కాలీజ్ తెనుగు పండితులగు

శ్రీమాన్, పి. వరదాచార్యులవల్లనున్ను,

కోలారు సంస్కృతపాఠశాలాధ్యక్షులగు

ప్రతివాదిభయంకరం, శ్రీమాన్, వేంకటాచార్యులవల్లనున్ను

పరిశోధింపంబడి,

కోలారు, హైస్కూలు హెడ్‌మాస్టరు,

మండయం. బి. శ్రీనివాసయ్యంగార్, ఎమ్. ఏ.

వారివలన

చెన్నపట్టణము:

ఊ. పుష్పరథశెట్టి అండు కంపెనీవారియొక్క

కలారత్నాకర మను ముద్రాక్షరశాలయందు

ముద్రింపింపఁబడియె.

1898.



వెల అణాలు-3.

శ్రీ

శ్రీమతే రామానుజాయ నమః.

# నిత్యానుసన్ధానము.

రెండవ భాగము.

తొండరడిప్పొడియాళ్వార్లు అనతిచ్చిన

వేదార్థసారమైన

# తిరుప్పళ్లియెఴుచ్చి.



వీటికి

పూర్వాచార్యులు అనతిచ్చిన వ్యాఖ్యానమునకు తగిన

ప్రతిపద, తాత్పర్య, విశేషార్థమున్ను, సంస్కృతప్రతికృతిశ్లోకములున్ను

విద్వాంసులైన

చెన్నపురి వెస్లియన్ మిషన్ కాలేజ్ తెనుగు పండితులగు

శ్రీమాన్, పి. వరదాచార్యులవల్లనున్ను,

కోలారు సంస్కృతపాఠశాలాధ్యక్షులగు

ప్రతివాదిభయంకరం, శ్రీమాన్, వేంకటాచార్యులవల్లనున్ను

పరిశోధింపంబడి,

కోలారు, హైస్కూలు హెడ్ మాస్టరు,

మండయం. బి. శ్రీనివాసయ్యంగార్, ఎమ్. ఏ.

వారివలన

చెన్నపట్టణము:

ఊ. పుష్పరథశెట్టి అండు కంపెనీవారియొక్క

కలారత్నాకర ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1898.



వెల అ॥ ౧-3.

# తొండరడిప్పొడి యాళ్వార్ల వారి ప్రభావంబు.

దక్షిణదేశంబున అధికసంపత్సమృద్ధిని జెంది ప్రసిద్ధికెక్కిన (తిరుక్కుడన్దై) అను పేరుగల కుంభఘోణమునకు పశ్చిమదిక్కున రెండుక్రోసుల దూరమున నుండు శ్రీమణ్డంగుడియని పేరుగల పట్టణంబున శ్రీతొణ్డరడిప్పొడియాళ్వార్లవారు కలి-౨౮౧౪ సంవత్సరముల పిదప ప్రభవసంవత్సర ధనుర్మాసమున కృష్ణపక్షచతుర్దశి మంగళవారము జ్యేష్ఠానక్షత్రమందు వైజయంతీవనమాలాంశసంభూతులై బ్రాహ్మణకులమందు అవతరించిరి. వీరికి నామకరణము విప్రనారాయణులని; వీరు జ్ఞానభక్తి వైరాగ్యసంపన్నులై యుండిరి. వీరికి చౌళోపనయనాదికర్మములు సాంగముగ తత్తత్కాలములయందు క్రమముగజేరిగినందున వేదశాస్త్రములను క్రమముగపఠించి వానిలో పండితులైనందున తద్దేశమందు ప్రచారముగొనియుండు ద్రావిడభాషలో మిక్కిలివైదుష్యమునుపొందియుండిరి; క్రమముగా వీరు గృహస్థాశ్రమమును అంగీకరించియు జితేంద్రియులై విశేషజ్ఞానభక్తి వైరాగ్యసంపన్నులైయుండిరి.

వీరు ఒకకాలవిశేషమందు శ్రీరంగక్షేత్రమునందు విజయముచేసియుండగా అచ్చట ఆదిశేషునిపై బవ్వళించియుండు ఆశ్రితరక్షణదీక్షితుఁడైన శ్రీరంగనాథుని అవిచ్ఛిన్నభక్తితో సేవించుచుండగ స్వామివారు సంపూర్ణ కటాక్షముచే వీరిని వీక్షించి అత్యుత్తమ భక్తి సంపత్తు వీరికిదొరకునట్లు అనుగ్రహించిరి. తరువాత ఈవిప్రనారాయణులు ఆమహాక్షేత్రమందే వాసముచేసుకొనియుండవలయునని కుతూహలముచే అచ్చోటనే వసించుచు స్వామివారికి తిరుమాలిక కైంకర్యముఁజేయవలయునని తలంచి కావేరీతీరమున తిరునందవనమని ఒక పుష్పతోటను స్వంతముగఁజేసుకొని ప్రతిదినమందును శ్రీరంగనాథునకు తులసీపుష్పమాలికలనుకట్టి సమర్పణఁజేయుచు కేవలభక్తివైరాగ్యపరులై వర్తించుచుండిరి.

కొన్నిదినములుగడచినపిదప ఒకానొకనాఁడు వీరు తోటలో తులసిచెట్లకు నీరుపోయుచు పాదిత్రవ్వుచుండఁగా దేవదేవియని పేరుగల గణికాస్త్రీ తనభగినితోడ ఆదేశపుదొరయగు చోళరాజసభకు వెడలి గీతనర్తనములచే ఆరాజును మెప్పించి వానిచే సన్మానముబొంది వెనుకదిరిగి తనగ్రామమునకుబోవుచు త్రోవనున్న ఈతోటనుజూచి మార్గాయాస పరిహారార్థముగ వీరితోటలో కొంతసేపుకూర్చుందమని తలంచి తోటలోప్రవేశించి ఒకప్రదేశమునగూర్చుండ ఆళ్వార్లు ఏరితట్టుదిరిగిజూడక తమకైంకర్యమునందేయుండుటను వీరిరువరుచూచి ఆశ్చర్యపడుచుండిరి; అట్టి సమయమున ఈదేవదేవి అక్క తనచెల్లెనుజూచి ‘‘ఓ దేవదేవి! నీవుబహుచమత్కారివి గద! నీవిభ్రమవిలాసవీక్షణములచే మహారాజాధిరాజులనుకూడ వశముజేసుకొనియెదవుగద! అది ఎక్కువకాదు, ఇట్టి వైరాగ్యసంపన్నులగువారిని నీవగలాడితనపు ఒయ్యారములచే వశముచేసు

కొనినయెడల నిన్ను నేను మెచ్చెద, నీయింట ఆఱుమాసంబులు సేవకావృత్తినుందును. నీచేత ఆకార్యముకానియెడల నేను జేసినప్రతిజ్ఞ చొప్పున నీవు నాకు వశవర్తియైయుండవలయు" అని పందెముమేసుకొనిరి. అందుకు దేవదేవి ఆలాగే కానిమ్మని ఒప్పుకొని "అక్కా నీవు ఊరికి వెడలుము, కొన్నిదినములలో నేనువీరినివశముఁజేసుకొని నాయింటికి పిలుచుకొనిరానియెడల నీవుచెప్పిన చొప్పున ప్రతిజ్ఞ చెల్లించెదను" అని చెప్పఁగా ఆమె ఊరికి వెడలెను. ఈ దేవదేవి తానుధరించియున్న దివ్యపీతాంబరమును, దివ్యాభరణములనుతీసివైచి తెల్లనివలువగట్టుకొని తిరుమణి తిరుచూర్ణములను ధరించి శుద్ధవిరక్తురాలివలె వేషాంతరధారియై ఈవిప్రనారాయణుల సమీపమునకువచ్చి వీరికి నమస్కరించి అంజలిబద్ధురాలై నిలువఁగా, వీరు "నీ వెవ్వతె, ఎందువచ్చితివి" అని ప్రశ్న చేయఁగా, దేవదేవి. "ఓస్వామి నేను మహాపాపిష్ఠురాలను, దేవరవారికి సేవకురాలై తమపాదసేవచే పునీతురాలు కావలయునని తలంచుచే సన్నిధిఁజేరినాను; అనాథురాలైనదానిని కటాక్షించినయెడల నేను కృతకృత్యురాలగుదును" అని అత్యంతవినయపూర్వకముగ ప్రార్థించి దండప్రణామంబుఁజేసి కంటియందునీరుదెచ్చుకొని తలవంచుకొని నేటిదినంబున నాపాతకరాశి నశించెను. నాజన్మంబు సార్థకంబయ్యె, మహానుభావులు దొరకియున్నారుగదా! ఇక నాకుసాటి ఎవ్వరు! అని మృదుమధురవచనములతో వారిచెవిసోకునటుల పలికెను. విప్రనారాయణులు దీనికపటవచనములను నిజమనితలంచి ఇట్టి పరితాపమును జెందిన ఈ ఆత్మ కడతేఱుట భగవన్ముఖోల్లాసమేకదా! యని తలంచి "ఓదాసీ ఆలాగు నీ అభిమతముండినయెడల ఈతులసీతోటలో కైంకర్యముఁజేయుచుండుము, భగవత్కటాక్షముగలుగుట ఎక్కువకాదు" అని ఆనతివ్వఁగా తోడనే ఈ దేవదేవి తులసిచెట్లకు నీరుపోయుట పాదులుచేయుట మొదలైనపనులనొనర్చి అప్పుడప్పుడు అలుకఁజెందినప్పుడు భగవన్నామస్మరణజేయుచు ఈలాగు శీతవాతాతపక్షుత్పిపాసలను సహించుకొని కొంతకాలముకడచినతరువాత ఒకానొకనాఁడు సంధ్యాకాలమున వర్షము ప్రారంభమై క్రమక్రమముగ విశేషవర్షముకురియఁగా, ఈ విప్రనారాయణులు పర్ణశాలలో ప్రవేశించి కూర్చుండియుండఁగ దేవదేవి ఆపర్ణశాల ముందుభాగమున ఆమహావర్షములోతడిసి చలిచే శరీరకంపమును జెందియుండఁగా విప్రనారాయణులు వీక్షించి మహావర్షముచే ఈ ప్రాణి మిక్కిలి తొందరపడుచున్నదేయని భూతదయచే పర్ణశాలలోపలరమ్మని ఆనతివ్వగ మహాభయమును జెందినదానివలె నటించి "దాసురాలు దేవరవారిసమీపమందుకూర్చుండ యోగ్యురాలగునా" యనిపలుకుచు మెల్లమెల్లగ ప్రవేశించి ఆ సంకుచితమైన పర్ణశాలలో ఒక మూలఁగూర్చుండి తడిగుడ్డనుతీసివైచి మఱియొకగుడ్డనుకట్టుకొని మెల్లగమాటలాడసాగెను. "స్వామి దేవరవారికి ఈనందవనకైంకర్యమువల్ల శరీరము ఎంత ఆయాసముజెందియున్నదో! ఆజ్ఞ ఇచ్చినయెడల ఈపాపిష్ఠహస్తములచే దేవరవారిపాదములను ఒత్తుదును" అనిచెప్పఁగా విప్రనారాయణులు కావచ్చునని ఒప్పి పాదములచాచేగా తన హస్తములచే పాదముల ఒత్తుచు క్రమక్రమముగ వీరిని వశపఱచుకొని విషయభోగములయందు అత్యాసక్తులుగఁజేసి రెండుమూడుదినములు ఆనందన వనమందేయుండి తరువాత తన ఇంటికి వెడలఁగా విప్రనారాయణులును తోటకైంకర్యమును వదలి దేవదేవి వెంటవెడలి దానిగృహము జేరిరి. దేవదేవి తన అక్కనుజూచి "ఓ అక్కా!

చూడుము వైరాగ్యగుణనిధియగు విప్రనారాయణుని తెచ్చితిని" అని చెప్పఁగా ఆమె ఆశ్చర్యపడి తన ప్రతిజ్ఞా ప్రకారముగ తన చెల్లెలకు దాసీవృత్తిచేయుచుండెను; దేవదేవి కొన్నిరోజులకు విప్రనారాయణులను ఇంటినుండి తఱుమెను; అలాగున ఆమె తన్ను తఱుమగొట్టినను వీరు దాని వాకిటనుండు తిన్నెమీద ముసుకు వేసుకొని పండుకొనియుండిరి. "ఆహా! స్త్రీవ్యామోహం బెట్టిది!" ఈలాగు పండుకొనియున్న విప్రనారాయణుల దురవస్థను సాక్షాల్లోకమాతయగు లక్ష్మి వీక్షించి ఆర్ద్రీహృదయురాలై లోకనాయకుఁడైన శ్రీమన్నారాయణుని దర్శించి "ఓస్వామీ దేవరవారికి పుష్పమాలా కైంకర్యము జేయుచుండిన ఈభక్తుని దురవస్థ తొలగించి కృపఁజేయఁవలదా" అని వినయముతో ప్రార్థింపఁగా స్వామివారు "విప్రనారాయణుని కోరికను నేటిదినము నెఱవేర్చి తదనంతరము జ్ఞానోదయము కలుగఁజేయుదును" అనితలంచి తమసన్నిధిలోనుండు స్వర్ణమయమగు అర్ఘ్యపాత్రను తీసుకొనివచ్చి వృద్ధబ్రాహ్మణరూపముతో దేవదేవి వాకిటనిలచి "ఓ దేవదేవి" అని పిలవగ ఆమె వచ్చి తలుపుతీయగ "విప్రనారాయణులు ఈపాత్రను నీకు ఇవ్వమని జెప్పిరి" అని యివ్వగ దేవదేవి ఆ బంగారుపాత్రను తీసుకొని మిక్కిలి సంతోషించి విప్రనారాయణుల దగ్గఱకువచ్చి ఓ స్వామీ! "ఇంటిలోపలికి దయఁజేయుఁడీ" అని చెప్పఁగ వీరు జాగ్రతగ లేచి మహోత్సాహముతో దానిగృహము బ్రవేశించి నాటిదినము రాత్రి సుఖముగ కాలముకడపిరి.

ఆ రెండవనాడు ప్రాతఃకాలమున సుప్రభాత సేవాకాలమందు శ్రీరంగనాథుని సన్నిధిలో స్వర్ణమయ అర్ఘ్యపాత్ర లేనందున దేవస్థానపు విచారణకర్తలు విచారణచేసి నిచుళాపురాధీశునకు తెలియజేయఁగ ఆరాజు విచారణఁజేయుచుండు సమయమున క్రమముగా దేవదేవి ఇంటనున్నదియని వర్తమానము తెలియగ ఆమెను రప్పించి అడుగఁగా ఆమె విప్రనారాయణుఁడు ఇచ్చెనని చెప్పెను. విప్రనారాయణుని పిలపించి విచారణచేయఁగా ఆసంగతి నాకు తెలియదని చెప్పినను రాజు వారిమాటను వినక ఆ దేవదేవిని విప్రనారాయణుని ఇరువురిని చెఱనుంచే నాజ్ఞాపించెను. ఈలాగు రెండుమూడురోజులుకడవఁగ ఒకానొకనాడు రాత్రి శ్రీరంగనాథులు నిచుళాధీశుని స్వప్నమందు దయచేసి "విప్రనారాయణునిపై యించుకయును తప్పులేదు ఇతని ప్రారబ్ధకర్మము ఇంతకే తొలగిపోనిమ్ము" అనితలంచి నేనే ఈబంగారు అర్ఘ్యపాత్రను తీసుకొనివచ్చి ఇచ్చితిని. అందువల్ల వీరిమీద దోషము లేదు విడచిపెట్టుమని ఉత్తరవుచేయఁగా అదే ప్రకారము ఆరాజు రెండవదినమందు ప్రాతఃకాలమున భక్తాంఘ్రిరేణులను పిలుపించి కారాగృహనిర్బంధమును తొలగించెను.

తదనంతరము ఈ విప్రనారాయణులకు సంపూర్ణజ్ఞానోదయము కలుగఁగా, తమయొక్క పూర్వ దుశ్చర్యను గురించి "మాదరార్క్కయల్ కణ్ణెన్నుం వలైయుట్పట్టు అన్దువేనై" (స్త్రీల చేపలవంటి కన్నుల వలలలో జిక్కి త్రోవగానలేని నన్ను) అని పలువిధములుగ పరితపించుచుండిరి; ఇందువల్ల వీరికి జ్ఞానభక్తి వైరాగ్యాధిక్యములు దృఢముగనిలకడ జెంది,

పాశురము॥ * ఊరిలేన్ కాణియిల్లై యుఱవుమత్తొరువరిల్లై
పారినిన్పాదమూలం పత్తిలేన్పరమమూర్తీ
కారొళివణ్ణనే కణ్ణనే కదఱుకిన్ఱేన్
నారుళర్కళైకణమ్మా వరఙ్గమా నహరుళానే॥ తిరు. పా. ౨౯॥

అని వీరు ఎల్లకాలమందును స్వామినేస్తుతించుకొని తదేకధ్యానపరులై తమయొక్క పూర్వకైంకర్యమును ఎడతెగక చేయుచు ౪౫ పాశురములుగల “తిరుమాలై” యని పేరుగల ప్రబంధమును ముందు చెప్పబోయెడు ౧౦ పాశురములుగల “తిరుప్పళ్ళియెழుచ్చి” యని తిరునామముగల శ్రీరంగరాజప్రాబోధకీ గ్రంథమునురచించి లోకమును ఉజ్జీవింపజేసిరి. సమస్తవిధ మహాపాతకములకును భగవద్భక్తులయొక్క పాదధూళినిసేవణమే ఆత్యంతిక ప్రాయశ్చిత్తమని తెలిసియున్న ఈ మహానుభావులు ఈ అర్థమును అందఱకును తెలియునట్లుగా విప్రనారాయణులని పేరుగలతమకు “తొణ్డరడిప్పొడి” “భక్తాంఘ్రిరేణు” “భక్తులపాదధూళి” అని తిరునామమును వహించి భగవద్భాగవతులగోష్ఠిలో కాలక్షేపము చేయుచుండిరి.

ఈచరిత్రయందు తొండరడిప్పొడి యాళ్వార్లవారికి ఒకదాసీసంసర్గంబున ఆకస్మికముగ ప్రాప్తమైన మహద్విపత్తును సూచించియున్నదిగద! ముక్తసమస్తసంగులయ్యు, పరమవైరాగ్యసంపన్నులయ్యు, వివిక్తప్రదేశవాసులయ్యు, భగవత్కైంకర్యైకపరులయ్యు ఉండినను వీరికే స్త్రీసంసర్గము ఈలాటి మహద్విపత్తు కలుగజేసెనని చెప్పుటచే, ప్రాకృతులైన జనులకు ఇక నెంత చెడుగు కలుగజేయునను నది చెప్పదరమా! ఈవిషయమై శ్రీమద్భాగవతశ్లోకము వాచకుల జ్ఞాపకార్థము ఉదహరింపఁబడుచున్నది.

శ్లో: సంగంత్యజేతమిథునవ్రతినాంముముక్షుః
స్సర్వాత్మనానవిసృజేద్బహిరింద్రియాణి।
ఏకశ్చరన్రహసిచిత్తమనంత ఈశే
యుంజీతతద్వ్రతిషుసాధుషుచేత్ప్రసంగః॥
స్కంధము - ౯, అ - ౬. శ్లో - ౫౧.

* ఓ పరాత్పరుడైన శ్రీరంగనాథ నెమ్మదిగవసించుటకు స్వంతమైన ఊరులేదు, మఱియు ఏవిధమైన భూస్థితియునులేదు, దాసునకు కష్టకాలమందు సహాయముచేయునట్టి బంధువులుగాని మిత్రులుగాని ఎవ్వరునులేరు, పరలోకసాధనమైన నీదివ్యపాదములయందు, నాకుభక్తియునులేదు గనుక, ఆర్తత్రాణపరాయణుఁడైన ఆశ్రితసులభుఁడైన ఓ రంగనాథ! నిర్గతికుఁడై మొఱపెట్టుచున్నాను. దేవరవారుతప్ప అనాథుఁడైనదాసుని రక్షించుటకు వేఱెవ్వరుగలరు?

# అవతరణిక.



ర౨ నిత్యానుసంధానపు రెండవ భాగమైన "తిరుప్పళ్ళియెళ్ళుచ్చి" యనుదానిని రచించినవారు తొండరడిప్పొడియాళ్వార్ వారుగద. "తిరుప్పళ్ళియెళ్ళుచ్చి" యన దివ్యపర్యఙ్కమునుండి మేలుకొలుపు నది; దీనికి సంస్కృతంబున "ప్రాబోధకీసూక్తి" యని ప్రతినామంబు; పరమభాగవతులయిన ఈ యాళ్వార్లవారు ఈ గ్రంథపు పది పాశురంబులను (పద్యములను) శ్రీరంగక్షేత్రమున కధిపతియైన శ్రీరంగనాథస్వామి ఎదుట అనుసన్ధానముజేసి అక్కడ విజయముజేసియుండు స్వామిని సాక్షాత్ శ్రీవైకుంఠపు పరమపదనాథుఁడైన శ్రీపరవాసుదేవుఁడనియే భావించి ఆ జగదీశ్వరుని ఈ పదిపాశురముల నుద్బోధచేయుదురు.

ఇచ్చట ప్రసక్తమైన మూడువిషయములనుగూర్చి ఇంచుక ముందు చర్చచేయ నవకాశంబయ్యెడిని. అవి ఏమన

౧. మానుషజన్మంబున బుట్టిన చేతనులు ఇప్పుడు ఆత్మానాత్మ విచారముజేసి తత్వార్థముదెలియ నవశ్యకమా?

౨. శ్రీరంగక్షేత్రమందు అర్చావతారంబుగ విజయముజేసియుండు శ్రీరంగనాథస్వామిని అప్రాకృత వైకుంఠాధిపతియైన సాక్షాత్ పరవాసుదేవుఁడే యని భావించేదగునా?

౩. జగదీశ్వరుని చేతనుఁడు ఉద్బోధజేయుట నన నేమి?

అనాదిగ తోడనే వచ్చియుండు కర్మఫలానుసారముగ చేతనులకు ప్రాప్తమగు అనేకజన్మములందు పశుపక్షి మృగాది జంగమస్థావర జన్మంబులుగాక మానుష

జన్మ ప్రాప్తియు అపూర్వంబై యున్నది. దానియందును తత్వజ్ఞానావహమై య్యు కాబట్టియే శాశ్వతఫలప్రదమయ్యు, ఉండు పురుషార్థసిద్ధిద్వారకు మనుష్య జన్మంబు మఱియు దుర్లభంబు. ఈ యర్థంబే శ్రీమద్భాగవతమందును (స్కం-౧౧, అ-౬, శ్లో-౬.) భగవద్గీతయందును (అ-౭, శ్లో-౩.) క్రమంబుగ గానవచ్చు.

౧ దుర్లభంమానుషంజన్మతదప్యధ్రువమర్థదం।
తత్రాయతేతకుశలఃక్షేమాయభవమాశ్రితః॥
౨ మనుష్యాణాంసహస్రేషుకశ్చిద్యతతిసిద్ధయే।
యతతామపిసిద్ధానాంకశ్చిన్మాంవేత్తితత్వతః॥ *

* ౧ చేతనునకు మనుష్యజన్మముద్వారకునది అపూర్వంబు; (తత్వజ్ఞానమూలకముగ) అది శాశ్వత పురుషార్థప్రదమగుట మఱియు సంశయంబు; గనుకబుద్ధిమంతులు ఈజన్మముద్వారకియుం డునపుడే తమశ్రేయస్సునకుగాను ప్రయత్నించవలయు.

౨ వేలకొలది మనుష్యులయందు ఒకానొకండుమాత్రము ఉత్కృష్ట పదవిజెందయత్నించు ను. యత్నించియు సిద్ధిజెందినవారిలో నిజముగ ఒకండుమాత్రమే నన్ను తెలిసికొనుచున్నాడు.

కాబట్టియే మానుషజన్మమందు బుట్టినచేతనులు ఇప్పుడే ఆత్మానాత్మవిచారంబు జేసి తదర్థంబు ఎఱుంగునది అవశ్యకంబే సరి. దీనిదెలియవలయునన పరబ్రహ్మ స్వరూపంబెట్టియది, పరబ్రహ్మకును చేతనులకును గల సంబంధంబెట్టియది, ఈ చేత నులు పునరావృత్తిరహితమైన శాశ్వతపదవినిపొంది బ్రహ్మానందమునుపొందు క్రమం బెట్టియది ఇవియే మొదలగువిషయములను తత్వపరిశీలనచే తెలియవలయు.

తత్వజ్ఞానప్రాప్తికి అవిచ్ఛిన్నమైన ఉపాసనము అవశ్యకంబనునది సరియేగద! సర్వవేదాంత ప్రతిపాద్యమైన పరబ్రహ్మను పొంద సాధకమగు ఉపాసనము జేయ ఆపరబ్రహ్మకు రెండువిధముల స్వరూపములు గలవని చెప్పబడియున్నది. వాటి లోనొకటి మూర్తస్వరూపంబు లేక సాకారము; మఱియొకటి అమూర్తస్వరూపంబు అనగ నిరాకారంబు లేక అప్రత్యక్షంబైనది. మూర్తస్వరూపంబు భేదావహంబు. అమూర్తస్వరూపంబు శాశ్వతంబైనది. వీటిని వ్యక్తంబనియు అవ్యక్తంబనియు క్రమక్రమంబుగ జెప్పబడియుకలదు. ఈరెంటను ఉనికిజేసి పరబ్రహ్మ అంతటను వ్యాపించి యుండును. ఈ యర్థంబ శ్రీవిష్ణుపురాణంబున గానవచ్చు. (అంశ-౧, అ-౨౨, శ్లో-౫౪.)

ద్వేరూపే బ్రహ్మణస్తస్యమూర్తంచామూర్తమేవచ।
క్షరాక్షరస్వరూపే తే సర్వభూతేష్వవస్థితే॥ *

* ఆపరబ్రహ్మకు రెండురూపములుగలవు. వీటికిమూర్తమనియు అమూర్తమనియు పేరు; మూర్తస్వరూపంబు పరిణామార్హంబగునది. అమూర్తంబుశాశ్వతంబైనది. ఈ రెండురూపంబులు సర్వభూతంబులవ్యాపించియుండును. పరబ్రహ్మయొక్క ఈ రెండుస్థితులనే అంగాంగిభావంబు, ధర్మధర్మిభావంబు, ప్రకారప్రకారీభావంబు, విశేషణ విశేష్యభావంబులని వివరించుటగలదు.

ఇదియునుంగాక పరబ్రహ్మస్వరూపమును ఐదుస్థితులగ్రహించి ఉపాసనము జేయవచ్చునని శ్రీరామానుజాచార్యులు మొదలగు పూర్వాచార్యులు వక్కాణించియున్నారు. అవిఏవన: 1 పరము, 2 వ్యూహము, 3 విభవము, 4 అంతర్యామి, 5 అర్చావతారము. అప్రాకృతవైకుంఠంబున నిత్యవిభూతిననుభవించుచు ఉనికిగొన్న పరబ్రహ్మస్వరూపమునకు 'పరము' అనిపేరు; జగత్సృష్టిస్థితిలయాదులకు ఆధారభూతుడై క్షీరాబ్ధియందు శేషశాయియై శ్రీమన్నారాయణస్వరూపమైయుండు స్థితియే వ్యూహంబు. దుష్టనిగ్రహ శిష్టపరిపాలనరూపంబైన ధర్మసంస్థాపనకుగాను అప్పుడప్పుడు రామకృష్ణాదులుగ అవతరించు పరబ్రహ్మస్థితికి 'విభవంబు' అనిపేరు. సమస్తచేతనవస్తువులందునియంతృవై లోనవ్యాపించి ఉనికిగొన్న పరబ్రహ్మస్వరూపస్థితికి 'అంతర్యామి' అనిపేరు. లోకహితార్థంబుగ అల్పజ్ఞులు విశేషజ్ఞులు కూడ తన్ను ధ్యానించి పూజించునటుల పరబ్రహ్మస్వరూపంబు అచ్చటచ్చట స్వయంవ్యక్తంబై దివ్యమంగళవిగ్రహరూపంబుగ ఉనికిగొన్నస్థితికి 'అర్చావతారంబు' అని పేరు. ఈఐదుస్థితులయందును పరబ్రహ్మయొక్క క్షరాక్షర రూపంబు గానవచ్చు.

పైజెప్పిన అక్షర లేక అవ్యక్తరూపంబు ఉపాసనమునకు కష్టసాధ్యంబు. ఏలనన, అటువంటి స్వరూపంబు సూక్ష్మదర్శులగు యోగులకును దురవగాహంబైనది. అది ఎట్లన, భగవద్గీత, అ-౧౨, శ్లో-3, ౫.

ఏత్వక్షరమనిర్దేశ్యమవ్యక్తంపర్యుపాసతే।
సర్వత్రగమచింత్యంచకూటస్థమచలంధ్రువం।
సన్నియమ్యేంద్రియగ్రామంసర్వత్రసమబుద్ధయః।
తేప్రాప్నువంతిమామేవసర్వభూతహితేరతాః।
క్లేశోధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసాం।
అవ్యక్తాహిగతిర్దుఃఖందేహవద్భిరవాప్యతే॥ *

* ఏఉపాసకులు నాశరహితుఁడయ్యు, నిర్ణయింపనసాధ్యుఁడయ్యు, ఇంద్రియములకు అగోచరుఁడయ్యు, ఎచ్చెటెచ్చేటను వ్యాపించియు అచింత్యుఁడయ్యు, ప్రకృతిని నియమించేదగిన వాఁడయ్యు, స్థిరస్వరూపుఁడయ్యు, ఎల్లప్పటికిని శాశ్వతుఁడయ్యు, ఉండుపరబ్రహ్మను తమఇంద్రియములనన్నిటినిజయించి సమస్తపదార్థంబులందును సమబుద్ధులై ఉపాసనముచేయుదురో, సమస్తప్రాణులందును హితచింతకులైన ఆలాటియోగులు నన్నే పొందుదురు. ఇట్లుఅవ్యక్తోపాసనము జేయువారికి విశేషమైన కష్టముకలదు. శరీరాభిమానులగు జనులకు అవ్యక్తోపాసనమార్గము బహుకష్టముచే సఫలమై చేకూఱును.

అయినను వ్యక్తోపాసనంబు సులభసాధ్యంబనియు, అటువంటి సరూపోపాసనముచేతనే పైజెప్పినకష్టతరంబగు అవ్యక్తోపాసన ఫలంబుదొరకుననియు శ్రీకృష్ణుఁడే అర్జునునకు ఉపదేశము జేసియున్నాఁడు. (భగవద్గీత, అ-౧౨, శ్లో-౨.) కాబట్టి సరూపోపాసనమువలననే కష్టతరంబగు అరూపోపాసనఫలంబుదొరకు విషయమై సులభమగు మార్గమును ఉపాసకులు చేకొనరాదేల ?

పైజెప్పిన వ్యక్తరూపోపాసనమందు కొందఱు పరబ్రహ్మ ఒకటియే అంతటను వ్యాపించి ఏకాకారమైయుండునని సర్వత్రసమదృష్టిచేజూచి ప్రపత్తిజేయుదురు. ఇట్లుసర్వంబు వాసుదేవమయంబని తెలియుజ్ఞానులు బహుదుర్లభంబైనందున (భగవద్గీత, అ-౭, శ్లో-౧౯.) మఱికొందఱు పరబ్రహ్మ తేజోంశసంభవంబులైన సూర్య, చంద్ర, అగ్ని, గరుడ, అశ్వత్థ, సముద్ర, గంగ, మొదలైన విభూతియుక్త పదార్థంబులను పూజింతురు. దీనికాధారము భగవద్గీత (అ-౧౦, శ్లో-౪౨)

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవవా।
తత్తదేవావగచ్ఛత్వం మమతేజోంశసంభవం॥ *

* ఏఏవస్తువు సంపద్యుక్తమయ్యు, శక్తివిశిష్టమయ్యు, ఊర్జితమయ్యు ఉన్నదో ఆలాటివస్తువులను, నాయొక్క తేజస్సుయొక్క అంశముచే బుట్టినవని, నీవు తెలుసుకొనవలయు.

ఈరెండు ఉపాసనక్రమములకంటెను ఉత్తమమయ్యు విశేషజ్ఞులకును అల్పజ్ఞులకునుకూడ సర్వసులభమయ్యు వుండునది అర్చావతారోపాసనంబు. దీనివిషయమై భగవద్గీతయందు చెప్పియుండునదేమన: (అ-౯, శ్లో-౧౫)

జ్ఞానయజ్ఞేనచాప్యన్యే యజంతోమాముపాసతే।
ఏకత్వేనపృథక్త్వేన బహుధావిశ్వతోముఖం॥ *

* మఱికొందఱు జ్ఞానమనుయజ్ఞముచే నన్ను ఆరాధించి, పరబ్రహ్మస్వరూపమగు నేను ఒకడే యనియు నానావిధస్వరూపుడనియు, ప్రపంచాకారముగ బహురూపుడనియు నన్ను ఉపాసనము జేయుదురు.

ఈశ్లోకపుకోనయందు చెప్పియుండు పరబ్రహ్మపు విశ్వరూపాకారమును అర్జునుఁడు తనకు పరమసఖుఁడైన శ్రీకృష్ణుని దివ్యశరీరంబున జూచినది. ఇటువంటి ఆశ్చర్యకరమైన తనవిశ్వరూపమును సూక్ష్మాకారముగ తనయందు దాచియుండి లోకహితార్థంబుగచూపు అవతారమునకు అర్చావతారంబనిపేరు. ఈదివ్యమంగళవిగ్రహమందు సాక్షాత్ శ్రీమన్నారాయణుఁడు స్వావయవభూతంబైన 'చిత్' 'అచిత్' అనుతత్వములను తనశస్త్రభూషణాదులుగ ధరించియుండును. ఈయర్థమును శ్రీవిష్ణుపురాణంబున గానవచ్చును.

క్షరాక్షరమయో విష్ణుర్బిభర్త్యఖిలమీశ్వరః।
పురుషావ్యాకృతమయంభూషణాస్త్రస్వరూపవత్॥

అస్త్రభూషణసంస్థానస్వరూపంరూపవర్జితః।
బిభర్తిమాయారూపోఽసౌ శ్రేయసే ప్రాణినాంహరిః॥ *

* సర్వవ్యాపకుడైన విష్ణువు క్షరరూపుడై, ఉనికిజెంది ప్రకృతిపురుషాత్మకమైన అశేషప్రపంచమును తనకుభూషణమగు అస్త్రశస్త్రరూపములుగను ధరించియుండును. ఆశ్చర్యగుణచేష్టితుడగు శ్రీహరి తాను స్వాభావికముగ రూపరహితుడుగ నుండినను ఈలాగుఅస్త్రభూషణముల చేఉనికిగొన్నస్వరూపమును చేతనుల ఉజ్జీవనార్థమై ధరించియుండును.

శ్రియఃపతియైన సాక్షాద్విష్ణువు అర్చావతారంబున ప్రపంచపు అఖిలతత్వంబులను తనశస్త్రభూషణాదులుగ ధరించియుండు క్రమంబెట్లన (విష్ణుపురాణము అంశం-౧, అధ్యా-౨౨, శ్లో. 2-23).

ఆత్మానమస్యజగతో నిర్లేపమగుణామలం।
బిభర్తికౌస్తుభమణి స్వరూపంభగవాన్హరిః॥
శ్రీవత్ససంస్థానధరం అనంతేచసమాశ్రితం।
ప్రధానంబుద్ధిరప్యాస్తే గదారూపేణమాధవే॥
భూతాదిమింద్రియాదించ ద్విధాహంకారమీశ్వరః।
బిభర్తిశంఖరూపేణ శార్ఙ్గరూపేణచస్థితం॥
బలస్వరూపమత్యంతం జవనాన్తరితానిలం।
చక్రస్వరూపంచమనో ధత్తేవిష్ణుఃకరేస్థితం।

పంచరూపాతుయామాలా వైజయంతీగదాభృతః।
సాభూతహేతుసంఘాతా భూతమాలాచవైద్విజ॥
యానీంద్రియాణ్యశేషాణి బుద్ధికర్మాత్మకానితు।
శరరూపాణ్యశేషాణి తానిధత్తేజనార్దనః॥
బిభర్తియచ్చాసిరత్న మచ్యుతోఽత్యంతనిర్మలం।
విద్యామయంతుతద్జ్ఞాన మవిద్యాచర్మసంస్థితం॥

పై వ్రాసిన శ్లోకములయర్థంబు ముందుం బోవు పట్టియందు సూక్ష్మముగ సూచించియున్నది.

౧ ఆత్మా (పురుష) = కౌస్తుభమణి.
౨ ప్రదాన (ప్రకృతి) = శ్రీవత్సమనుమచ్చ
౩ బుద్ధి (మహత్తు) = గద.
౪ భూతాది (తామసాహంకారము) = శార్ఙ్గ యుధము.
౫ ఇంద్రియాది (సాత్వికాహంకారము) = శంఖము.
౬ మనస్సు = చక్రాయుధము.
౭ సూక్ష్మపంచభూతము, స్థూలపంచభూతము = వైజయంతీవనమాల.
౮ జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు = బాణములు.
౯ జ్ఞానము (నిర్మలము) = నందకంబను ఖడ్గము.
౧౦ అజ్ఞానము = నందకమును మూసియుండు ఒఱ.

ఈయర్థమునే కవితార్కికకేసరియను బిరుదుచే ప్రసిద్ధులైన శ్రీమద్వేదాంతదేశికులు అధికారసంగ్రహం బను గ్రంథమున "పురుడన్మణివరమాగ" యను ౪౧-వ పద్యమున విశదపఱచియున్నారు. ఇట్లు చిదచిద్విశిష్టుండైనసాక్షాత్ పురుషోత్తముండే అర్చావతారంబున కనుబడుటచే స్వయంవ్యక్తముగ శ్రీరంగక్షేత్రమందు విజయముజేసియుండు శ్రీరంగనాథుని వైరాగ్యనిధియైన తొండరడిప్పొడి యాళ్వార్లవారు వైకుంఠాధిపతియైన సాక్షాత్ శ్రీపరవాసుదేవుండే యని భావించినది న్యాయమే. ఈయర్థమునే తాము అనుసంధానము జేసినదిగాక లోకమునకం తయు బోధించి ఉపకారము జేసిరి.

సౌలభ్యాతిశయమును విశేషముగజూపించి సాక్షాత్ విష్ణువు అర్చావతారంబున భక్తాదులకు అనుకూలముగ ఉండునటుల "తిరునరైయూర్" 'తిరుపతి'

మొదలగు స్థలములందు నిలచియుండువాడుగను, "తిరుక్కోవిలూరు" మొదలగు దివ్యదేశములందు నడచిపోవువాడుగను, "తిరువాలి" మొదలగు పుణ్యస్థలముల కూర్చునికి గొన్నవాడుగను, కుంభకోణము, శ్రీరంగము, తిరువళ్ళూరు, శ్రీరంగపట్టణము మొదలగుదివ్యదేశములందు నాగపర్యంకమున శయనించియున్నవాడుగను కనుబడును. ఇట్లుపరబ్రహ్మను ధ్యానించవలయునని శ్రీమద్భాగవతంబున స్పష్టపఱచియున్నది. (స్కం - 3, అధ్యా - ౨౮, శ్లో - ౧౯.)

స్థితం వ్రజన్తమాసీనం శయానంవాగుహాశయం।
ప్రేక్షణీయేహితంధ్యాయేత్ శుద్ధభావేనచేతసా॥ *

* పరిశుద్ధమైన అంతఃకరణముచే (ఆపరబ్రహ్మను) నిలచియుండువానినిగను, నడచిపోవువానినిగను, కూర్చుకొనియుండువానినిగను, శయనించియుండువానినిగను, ఈలాగుదర్శనీయమైన కల్యాణగుణ కర్మవిశిష్టునిగ ధ్యానించేవలయు.

ఈయర్థమునే చతుష్కవిప్రధానులైన తిరుమఙ్గైయాళ్వార్లవారు "తిరుమొళ్ళి" యను గ్రంథంబున (౧౩౧ వ-పాశురము) వక్కాణించియున్నారు.

ఇట్లు సర్వసులభుడైన సర్వేశ్వరుని చేతనులుసమీపించి నిత్యకైంకర్యలాభమునుపొంద ననేకోపాయములను హేరాళముగ తెలియపఱచియున్నను, చిరకాలపరిశ్రమసాధ్యంబులైన వానినివిడిచి కలికల్మషావహంబైన ఈకాలంబునకు అనుగుణముగ చేతనులకుసులభముగ ఫలప్రాప్తిచేకూనునట్లు పూర్వాచార్యులు నవవిధంబులైన ఉపాయసోపానములను ఏర్పఱచియున్నారు. అది ఎట్లనః

శ్రవణంకీర్తనంవిష్ణోః స్మరణంపాదసేవనం।
అర్చనంవన్దనందాస్యం సఖ్యమాత్మనివేదనం॥ ✝

✝ సమస్త చిదచిద్వస్తువులందును వ్యాపించియుండు జగదీశ్వరుని అద్భుతచేష్టకథాశ్రవణమును, వానిదివ్యనామ సంకీర్తనమును, వానిగుణకర్మ స్మరణమును, వాని దివ్యపాదసేవయును, వాని దివ్యమంగళవిగ్రహపు పూజయును, వానికి నమస్కరించుటయును, అతనికి అవిచ్ఛిన్నమైన కైంకర్యమును, వానియందు ప్రీత్యతిశయంబున వానితోడిస్నేహమును, తుదకు తన్నేవానికి సమర్పించుటయును, ముముక్షులుచేయదగినవి.

కాబట్టి భక్తుండైనట్టిడు ప్రొద్దుననుండి రాత్రివరకు తానుస్వభావముగజేయదగిన ఉషఃకాలప్రబోధ, దంతధావన, స్నాన, భోజన, పిపాసోపశమన, తాంబూల

చర్వణ, నిద్ర మొదలగుకార్యములు అర్చావతారపు సాక్షాత్ పరవాసుదేవున కును తనవలెనే ఉన్నవనిభావించి వాటిని అతనికినిసమర్పించి తరువాతవాటిని భగవత్ప్రసాదరూపముగ తానుస్వీకరించేను. ఇట్లు ఎల్లకాలము కైంకర్యముచే యుచేరాగా తన సర్వపాపములుతొలగి కర్మపాశమువలన విడిపించబడును. మను జానకు సహజమైన స్నానపాన భోజనాదులను అతనికే (పరబ్రహ్మకు) ప్రథమతః సమర్పించి తరువాత వాటినిభగవచ్ఛేషరూపముగ నడపించేవలయుననియు, తనకు భక్తిపురస్సరముగ సమర్పించిన పత్ర, పుష్ప, ఫల, జలాదులను అవాప్తసమస్త కాముఁడైనను పరబ్రహ్మ తానుస్వీకరించేననియు సాక్షాత్ శ్రీకృష్ణుఁడే అర్జునునకు ఉపదేశించియున్నాడు. అది ఎట్లన:

యత్కరోషియదశ్నాసి యజ్జుహోషిదదాసియత్।
యత్తపస్యసికౌంతేయ తత్కురుష్వమదర్పణం॥ IX - 27.

పత్రంపుష్పంఫలంతోయం యోమేభక్త్యాప్రయచ్ఛతి।
తదహంభక్త్యుపహృతం అశ్నామిప్రయతాత్మనః॥ IX - 26.

మన్మనాభవమద్భక్తో మద్యాజీమాంనమస్కురు।
మామేవైష్యసియుక్త్వైవ మాత్మానంమత్పరాయణః॥ IX - 34.

మచ్చిత్తామద్గతప్రాణాః బోధయంతఃపరస్పరం।
కథయంతశ్చమాంనిత్యం తుష్యంతిచరమంతిచ॥ X - 9.

I. కుంతీపుత్రుడైన అర్జునుడ, నీవు ఏమిచేయుదువో, ఏమిభుజింతువో, ఏమి హోమము చేయుదువో, ఏమి దానముచేయుదువో, ఏతపస్సుచేయుదువో, వాటినంతయు నాకేసమర్పించేము.

II. ఎవడుభక్తిచే నాకు ఒక దళమైనను, పుష్పంబైనను, పండునైనను, నీటినైనను, సమర్పించునో, అట్లు భక్తిపురస్సరముగ పరిశుద్ధాంతఃకరణముచే సమర్పించినవాటిని నేను భుజించెదను.

III మనస్సు నాయందేయుంచి, నాభక్తుడై, నన్నే పూజించియుండుము, నాకు నమ స్కరించేము. ఇట్లు నన్నేనమ్మియుండువాడుగ నీచిత్తమును నియమించియున్నట్టైన నీవునన్నే పొందుదువు.

IV. నాయందే మనస్సుగలిగియు, నాయందే ప్రాణము ధరించేకొనియు, పరస్పరముగ నన్నుగురించియే బోధించేచేను, నిత్యము నా నామసంకీర్తనమేచేసియు, కొందఱు ఉపాసకులు ఉప్పొంగి ఆనందించేచేన్నారు.

ఈలాగు భగవత్పరాయణులయ్యు, భాగవతనిష్ఠాగ్రేసరులయ్యు, మహావైరాగ్యసంపన్నులయ్యు, భగవద్భాగవతకైంకర్యంబే తమకు పరమప్రాప్యంబని నిశ్చయబుద్ధిగలవారైయ్యు ఉండిన తొండరడిప్పొడి యాళ్వార్లవారు ఎల్లప్పుడును శ్రీరంగనాథుని అవిచ్ఛిన్నకైంకర్యమున నిరతులై కాలక్షేపము జేయుచుండిరి.

ఈలాటి మహాత్ముల ప్రాబోధకీసూక్తియందు జెప్పియుండు (సాక్షాత్ పరవాసుదేవుడైన) శ్రీరంగనాథుని ఉద్బోధజేయు కైంకర్యము, ముముక్షులగు చేతనులు ప్రొద్దుననుండి రాత్రివరకు జరిపించే ఇతరకైంకర్యాదులకు ఉపలక్షణంబని తెలియునది.

ఈ "తిరుప్పళ్ళియెఴుచ్చి" యను గ్రంథపు పది పాశురములందును, దొరలను స్తుతిపాఠకులు స్తుతించురీతిని తొండరడిప్పొడియాళ్వార్లవారు ప్రభాతసూచకములను విజ్ఞాపించి "ఆరాధనకాలముసమీపించెను, ప్రబోధకాలమందు జూడదగిన మంగళద్రవ్యములు సిద్ధమైయున్నవి, మంగళవాద్యములు చుట్టును అల్లుకొనియున్నవి, భాగవతులకు దాసభూతుడైన నేనును, నలువ, దివస్పతి, కుమారస్వామి, మొదలగు దేవతలందఱు నీవు ప్రబోధమగు దివ్యదర్శనమును చేకొని ఆనందించి దివ్యపాదముల కెఱగి మంగళాశాసనముజేయ అవసరప్రతీక్షకులై కాచియున్నారము. కాన కారుణ్యనిధియైన నీవు ఎచ్చరికగొని మమ్ముకటాక్షించి దాసభూతులైన మాయొక్క కైంకర్యమును అంగీకరించేవలయు" అని ప్రార్థించియున్నారు.

ఈ గ్రంథపు పాశురములు "ఎణ్‌శీర్‌కఴినెడిలడి యాశిరియ" మను వృత్తమున వ్రాయబడియున్నది.

ఈ గ్రంథంబున "ఴ" యను తమిఴ్భాషాక్షరం బుపయోగింపబడియున్నది. దీనికి తెనుగున "ళ" యనునది ఇంచుమించుగ సరిబోలును: ఉ. ఆఴ్వార్, ఆళ్వార్. ఇదియునుంగాక "ఱ్ఱ" యనుఅక్షరంబు "త్త" మఱియు "ట్ట" యను రెండక్షరములకు మధ్యమంబుగ నుచ్చరించేను.

శ్రీః

శ్రీమతే రామానుజాయ నమః.

తొండరడిప్పొడి యాళ్వార్ల వారు ఆనతిచ్చిన

వేదార్థసారమైన

# తిరుప్పళ్ళియెழுచ్చి

వీరి విషయమై తిరువరంగప్పెరుమాళరైయర్ సాయించిన

తనియన్ శ్లోకము.

శ్లో॥ తమేవ[1] మత్వా పరవాసుదేవం రంగేశయం రాజవదర్హణీయం।
ప్రాబోధకీం యోఽకృత సూక్తిమాలాం [2]భక్తాంఘ్రిరేణుం[3] భగవంతమీడే॥ ౧॥

తం-ఏవ=తమేవ-పరవాసుదేవం, అనుపదముతో
మత్వా - ప్రపత్తిచేసి - భావించి [అన్వయము
పరవాసుదేవం - పరమపదనాథుడనియే
రంగేశయం - శ్రీరంగమునందు పవ్వళించియుండు
రాజవత్ - మహారాజువలె
అర్హణీయం - పూజ్యుడైన

ప్రాబోధకీం - ప్రాతఃకాలమందు మేలుకొలుపు
యః - అకృత - ఎవరు ఆనతిచ్చిరో [చేన్న
సూక్తిమాలాం - గ్రంథమాలికను
భక్తాంఘ్రిరేణుం - భక్తాంఘ్రిరేణు అను
భగవంతం - పూజ్యులైన ఆళ్వార్లను
ఈడే - స్తుతించి నమస్కరించుచున్నాడను.

అఖిల భూమండలాధిపతియైన సార్వభౌముని వలె భక్తిచే పూజింపఁబడుచున్న వాఁడై శ్రీరంగక్షేత్రమందు శేషపర్యంకముపై పవ్వళించియుండు శ్రీరంగనాథుని వేదాంత ప్రతిపాద్యుఁడైన ఆ సాక్షాత్ పరమపదనాథుఁడే అని భావించి ప్రపత్తిచేసి ప్రభాతకాలమందు యోగనిద్రవల్ల ఉద్బోధ మొనర్చునట్టి దివ్య గ్రంథమాలను లోకహితార్థమై ఎవరు రచియించిరో అట్టి వైభవముగల జ్ఞానభక్తి వైరాగ్యభూషితులైన భక్తాంఘ్రిరేణు అను తిరునామముగల పూజ్యులైన తొండరడిప్పొడి యాళ్వార్లవారిని స్తుతించి వందనము చేయుచున్నాఁడను.

[1] ఏవార్థమువలన పరవాసుదేవుఁడనియు, మఱియు వేరొకండు కాఁడనియు తాత్పర్యము. దీనికాధారము:—శ్లో॥ కావేరీ విరజా సేయం వైకుంఠం రంగమందిరం। స వాసుదేవో రంగేశః ప్రత్యక్షం పరమం పదం॥ దీని అర్థము. ఈ కావేరీనదియే విరజానదియు, శ్రీరంగక్షేత్రమే వైకుంఠమనియు, ఈ రంగనాథస్వామియే వాసుదేవుఁడనియు, ఇదియే ప్రత్యక్షమైన పరంధామమనియు తెలియునది. రంగేశుఁడైన పరవాసుదేవుఁడే శ్రీరంగక్షేత్రమందు వేంచేసి లీలావిభూతియగు ఈ భూలోకమును, నిత్యవిభూతియగు శ్రీవైకుంఠమును పరిపాలనము చేయుచున్నాఁడు.

[2] ఈ పదమునందు తొండరడిప్పొడి ఆళ్వార్లవారు సాయించిన "తిరుమాల" అనెడి గ్రంథము అంతర్భూతమై నిలుచుచున్నది.

[3] భక్త=భగవద్దాసభూతులైన వైష్ణవుల; అంఘ్రి=పాదముల, రేణు=రజఃకణములు అనగా పాదధూళి. (ఈ మూఁడుపదములు చేరి తొండర్-అడి-పొడి, అని అయినది.)

శ్లో॥ మణ్డఙ్గుడియెన్బర్ మామఱైయోర్ మన్నియశీర్
తొణ్డరడిప్పొడి తొన్నకరం[1] వణ్డు
తిణర్తవయ[2]ల్ తెన్నరఙ్గత్తమ్మానై ప్పళ్ళి
యుణర్త్తుంపిరా[3] నుదిత్తవూర్ ॥ ౨ ॥

మణ్డఙ్గుడిఎన్బర్ - మండంకుడి అందురు.
మామఱైయోర్ - మహాశాస్త్రవేత్తలు
మన్నియశీర్ - శాశ్వతకీర్తిగల
తొణ్డరడిప్పొడి - తొండరడిప్పొడియని తిరునామముగలవారి
తొల్నకరం - పురాతనపట్టణము
వణ్డు - తుమ్మెదలు

తిణర్తవయల్ - అవిచ్ఛిన్న శబ్దములుగల వరిపొలములుగల
తెన్నరఙ్గత్తు - శ్రీరంగక్షేత్రమునందు
అమ్మానై - పవ్వళించియుండుసర్వస్వామిని
పళ్ళియుణర్త్తుం - మేల్కొలుపునట్టి
పిరాన్ - స్వామి
ఉదిత్తవూర్ - అవతరించినపట్టణము.

భ్రమరములు ఎడతెగక ఝుంకారము చేయుచుండు పొలములచే పరివేష్టితమును, సున్దరమునగు శ్రీరఙ్గక్షేత్రమునందు శేషపర్యఙ్కముపై శయనించుకొని యోగనిద్రజేయుచున్న శ్రీరఙ్గనాథుని నిద్రవిడచి మేల్కొనుటకై విన్నపముచేసుకొన్న శ్రీతొణ్డరడిప్పొడి యాళ్వార్లవారు అవతరించిన దివ్యదేశము, శాశ్వతమైనకీర్తిగల తిరుమండంగుడియని, పూజ్యులై వేదాధ్యయనసంపన్నులైన శ్రోత్రియులు కొనియాడుదురు.




1 ఆళ్వార్లవారు అచ్చట అవతరించినందున దీనికి ఆవైశేష్యంబు పుట్టినది. "తెన్నగరం" యనిపాఠాంతరము; అప్పుడు "దర్శనీయమైన పట్టణము అని తాత్పర్యము.

2 భ్రమరములు గుంపుజేరి ఝుంకారముచేయుచు మధుపానముచేయునట్టి కలువపుష్పములు వికసితమైయుండు కేదారములు శ్రీరంగక్షేత్రమును జుట్టియున్నవనియు, జలమునిండి యథేష్టముగానున్నదనియు తాత్పర్యము.

3 పిరాన్—మహోపకారకుఁడు. ఎందువల్లననగా, ఈ ప్రబంధమును రచియించి ముందు రాఁబోవు వారికి అనుసంధించునటుల ఉపకారము జేసినందుకు.

కదిరవన్కుణదిశైచ్చికరంవన్దణైందాన్ కనవిరుళకన్దదుకాలైయంపొట్టుతాయ్,
మదువిరిందొట్టుగినమామలరెల్లాం వానవరరశర్కళ్ వన్దువన్దీణ్డి।
యెదిర్‌తిశైనిఱైందనరివరొడుంపుకున్ద విరుజ్గళిన్ శ్రీట్టముంపిడియొడుమురశు
మదిర్తలిలలైకడల్‌పోన్ఱుళతెజ్గు మరజ్గత్తమ్మాపళ్లియెళుందరుళాయే ౧

కదిరవన్ కుణదిశై చ్చికరం - సూర్యుడు తూర్పు [దిక్కు
వన్దు అణైన్దాన్ - వచ్చిచేరినాడు
కన ఇరుళ్ - ఘనమైనచీకటి
అకన్డతు - దూరమైనది
కాలైయంపొఱ్ఱుతాయ్ - వెలుతురుపాటుకాలమై
మదువిరిన్దుఒఴ్ఴుగిన - వికసితమైమధువు ప్రవహిం[చెను
మామలరెల్లాం - గొప్పగొప్ప పుష్పములు
వానవర్ అరశర్కళ్ - దేవతులు, రాజులు
వన్దువన్దు ఈణ్డి - వచ్చివచ్చి చేరి [యున్నారు
ఎదిర్తిశై నిఱైన్దనర్ - ఎదురుగా గుంపుగా నిండి

ఇవరొడుంపుకున్ద - వీరికి వాహనముగా వచ్చిన
ఇరుంకళిఱు ఈట్టముం - పెద్దవైన మొగయేనుగల [కూటము
పిడియొడు - ఆడయేనుగలతో
మురశుం - మురజవాద్యము
అదిర్తలిల్ - శబ్దముచేయుటయందు [వలెనే
అలైకడల్ పోన్ఱు - అలలుగలసముద్ర ఘోషము
ఉళదు ఎజ్గుం - ఎక్కడెక్కడను ఉండును [మీ
అరజ్గత్తమ్మా - శ్రీరంగమున వేంచేసియున్న ఓస్వా
పళ్లి ఎఴున్దు - శయనమునుంచి లేచి
అరుళాయే - కృపచేసికటాక్షింపవలెను.

సర్వరక్షకుడవైన ఓస్వామి! ఆశ్రితవ్యామోహముచేత నిద్రబోవు నీవు దాసభూతులమైన మాయొక్క విజ్ఞాపనము లాలింపుము. లోకసాక్షియైనదినమణి తూర్పు దిక్కున ఉదయగిరియొక్కశిఖరమును అప్పుడేచేరెను; రాత్రియంతయు వ్యాపించిన గాఢాంధకారము దూరమైపోయినది. నీఆరాధనము చేయుటకు యోగ్యమైనముఖ్య కాలము సమీపించినది; తామరమొదలైన గొప్పగొప్పపుష్పములు వికసితమై వాని నుండిమధువుప్రవహించుచున్నది; దేవతులు మఱియు మహారాజులువచ్చివచ్చి కూడి ఉభయవిభూతివిశిష్టుడవైన నీసన్నిధియెదురుగా నీకటాక్షవీక్షణమునకై గుంపుగా నిండియున్నారు; వీరితోడవచ్చిన వీరివాహనములైన మొగయేనుగుల సమూహము ఆడయేనుగులసమూహము మఱియు మురజవాద్యములు వీనిమహాధ్వని అలలు గల సముద్రఘోషమువలెనే అంతట వ్యాపించియున్నది; కాబట్టి శ్రీరంగక్షేత్రమునకు అధిపతియైన శ్రీరంగనాథస్వామీ! నీవు ఈప్రాతఃకాలమున దివ్యపర్యంకమునుండి లేచి దాసభూతులమైన మమ్ము కటాక్షించి మమ్ము కైంకర్యవృత్తిలో నియమించి అనుగ్రహింపవలెను.

పూర్వాద్రేశ్శిఖరంగతో దినమణిర్గాఢంతమోనిర్గతం। ప్రత్యూషః ప్రబభూవపద్మనివహాత్ప్రోత్ఫుల్లపత్రాన్మధు। నిష్యన్దత్యఖిలాస్సురాన్నృపతయోఽప్యాగత్య యుష్మత్పుర। స్సంఘీభూయ సుసంస్థితాస్సదనుగైర్నాగైర్మదచ్యోతిభిః ॥౧॥ శైలాకారసమానకాయకరిణీబృందైః కృతైర్బృంహితైః। రాశా పుష్కరకనాదయా క్తమురజావాద్యస్యశబ్దేనచ। ప్రోద్యద్భంగసముద్రఘోషవదహో వ్యాప్తంసమస్తంజగ। ద్రంగాధ్యక్షకృపానిధే శయనాదుత్థాయరక్షస్వనః॥౨॥

కొళ్లుంగొడిముల్లైయిన్ కొళ్లుమలరణవి కూర్న్దదుకుణదిశై మారుతమిదువో
ఎళ్లుందనమలరణై ప్పళ్లికొళ్లన్న మీన్పనిననైన్దతమ్మి రుఞ్జిఱకుదఱి
విళ్లుంగియముదలై యిన్పిలంపురై పేళ్వాయ్ వెళ్లెయిఱుఱవదన్విడత్తినుక్కనుజ్ఞి
యళ్లుంగియవానై యినరున్దుయరెకెడుత్త వరజ్గత్తమ్మా పళ్లియెళ్లున్దరుళాయే ౨

కొళ్లుంకొడిముల్లైయిన్ - పొడుగుగా పెరిగినతీగెలుగల [మునువహించి
కొళ్లుమలర్ అణవి - సుందరమైన పూలపరిమళ
కూర్న్దతు - వ్యాపించెను
కుణదిశై మారుతమితువో - తూర్పుదిక్కునగాలి
ఎళ్లుందన - బయలుదేరెను
మలర్ అణై - తామరమొదలైన పూలపాన్పుపైన
పళ్లికొళ్ అన్నం - నిద్రించే హంసపక్షులు
ఈన్పనిననైన్ద - రాత్రియందుబడిన మంచే చేత
తంఇరుంశిఱకు - తమపెద్దరెక్కలను [తడిసిన
ఉదఱి - ఝాడించేకొని
విళ్లుంగియముతలైయిన్ - మ్రింగిన మొసలి
పిలంపురై - గుహానుబోలిన [యొక్క
పేళ్వాయ్ - గొప్పనోరుగల
వెళ్లెయిఱుఱ - తెల్లగానుండు పండ్లుతగలంగా
అదన్ విడత్తినుక్కు - దానిదంతపువిషమునకు
అనుజ్ఞిఅళ్లుంగియ - భయపడిఆర్తధ్వనిచేసిన
ఆనైయిన్ - శ్రీగజేంద్రుని
అరుంతుయర్ కెడుత్త-కడుదుఃఖమునుపోగొట్టిన
అరజ్గత్తమ్మా- శ్రీరంగములో వేంచేసియున్నస్వామీ
పళ్లిఎళ్లున్దు - శయనమునుంచి లేచి
అరుళాయే - కృపచేసికటాక్షింపుము.

ఓస్వామీ, దాసభూతులమైన మాయొక్కమనవి ఆలకింపవలెను. ప్రభాతసూచకముగా తూర్పుదిక్కుయొక్క ఈమారుతము విస్తారముగ పెరిగినలతలుగల మల్లెచెట్టుయొక్కసుందరమైన పూలవాసనను వహించివచ్చి, మీరంతట ఇంక నెందుకు నిద్రించెదరు అనులాగున వ్యాపించుకొని వీచుచు నిచ్చేట అభివృద్ధియగుచున్నది; కమలము మొదలైన పుష్పపాన్పుపైననిద్రించే హంసపక్షులు రాత్రియందు కురిసిన మంచే చే తడిసిన తమవిశాలమైన రెక్కలను విదులించుకొని బయటబయలు దేఱినవి. ఈలాగున ప్రభాతసమయపు నీఆరాధనకాలము సమీపించినది. తన్ను మ్రింగవచ్చిన గొప్పమొసలియొక్క గుహావలెనుండు వెడలుపైన నోటితెల్లనిపండ్లు తనశరీరమును తగలగా దాని దంతపువిషమునకు భయపడి నిన్ను శరణుబొంది ఆర్తధ్వనిజేసిన శ్రీగజేంద్రుని మిక్కుటమైనదుఃఖమును నివారించిన ఆశ్రితవత్సలుండైన శ్రీరంగనాథస్వామీ! యోగనిద్రనుండి మేల్కొని ఆర్తులమైన మాయందుకృపజేసి మమ్ముకటాక్షించి మమ్ము నీకైంకర్యవృత్తియందు నియమింపవలెను.

వల్లీకోమలమల్లికాసుమనసామామోదసంభారకం । ప్రాచీగంధవహోవహన్నభియయౌ కృత్వాసుమన్దాంగతిం ॥ పత్రాలంకృతపంకజాతశయనే నిద్రాసుఖాహ్లాదితాః । చక్రాఙ్గానిశిజాతహైమతశిఖిస్సంప్లావితాచ్ఛచ్ఛదాః ॥౨॥ ధూన్వన్త్యద్యదరీసమానవదనాన్మృత్యూపమాద్దారుణాత్ గ్రాహాత్తీక్ష్ణవశక్షుదన్తనికర క్ష్వేళాత్ప్రభీతంద్విపం ॥ దీనధ్యానయుతంరరక్షసహరి స్త్వందీననాథధునా । రఙ్గాధ్యక్షకృపానిధేఽహిశయనాదుత్థాయరక్షస్వనః ౹౨౹

శుడరొళిపరన్దనశూట్ప్ తిశై యెల్లామ్ తున్నియ తారకై మిన్నొళిశురుజ్గి
పడరొళిపశు త్తనన్పనిమదియివనో పాయిరుళగన్డతు పైంపొట్రిఙ్గ్కముకిన్
మడలిడై కీఱివణ్పాళై కళ్ నాఱ వైకఱైకూర్న్దదుమారుతమిదువో
అడలొళితికళ్ తరుతికిరియన్దడకై అరజ్గ త్తమ్మా పళ్ళియెళ్లుందరుళాయే 3

శుడరొళిపరన్దన- సూర్యకిరణములువ్యాపించినవి
శూళ్ంతిశై యెల్లాం - ఆవరింపబడిన అన్నిదిక్కులయందును
తున్నియతారకై - నిండిననక్షత్రములు
మిన్నొళిశురుంగి - మినుగు ప్రకాశముకుందిపోయి
పడరొళి - విస్తరించిన ప్రకాశముగల
పశుత్తనన్ - కళతుందెను
పనిమతి ఇవనో - చల్లగానుండు ఈచంద్రుఁడు
పాయ్ఇరుళ్ - మూసుకొనినచీకటి
అకన్డదు - వెనుకకుపోయెను
పైంపొళిల్ - పసిమియుద్యానములయందుండు
కముకిన్ - పోకమ్రానుల
మడలిడైకీఱి - లేతమట్టలనడుమచీల్చుకొని
వణ్పాళైకళ్ - బయల్పడిన పుంబాళలు
నాఱ - వాసనగొట్టగా
వైకఱై - ప్రాతఃకాలపు
కూర్న్దదు - వ్యాపించినది
మారుతంఇదువో - ఈవాయువు
అడలొళి - స్ఫురత్తైనప్రకాశము
తికళ్తరు - వెలిగించు
తికిరి - శ్రీచక్రాయుధమునుధరించిన
అంతడకై - సుందరముగాను విశాలముగానుండుహస్తములుగల
అరజ్గత్తమ్మా - శ్రీరంగమునందు వేంచేసియుండు ఓస్వామీ
పళ్ళియెళుందు - నాగపర్యఙ్కమును విడిచిలేచి
అరుళాయే - దాసభూతులమైనమమ్ముకటాక్షింపవలెను.

సర్వలోకశరణ్యుడైన ఓ స్వామీ! నీ తిరువడిలో విజ్ఞాపించుకొనుట యే మనఁగా ప్రభుత్వసూచకముగా ఆవరించినదిక్కులందంతట సూర్యకిరణములు వ్యాపించినవి; రాత్రియందంతయు ధళధళమని ప్రకాశించుచుండిన నిండిననక్షత్రములు కళాహీనమైనవి, చంద్రుఁడు తనకాంతియుడిగి వ్యస్తస్వరూపుఁడై అగుపడుచున్నాఁడు. అష్టదిక్కులయందును రాత్రియంతయు కమ్ముకొనియుండిన చీకటితొలఁగి పోయినది; పసిమిగల ఉద్యానవనములలోనుండు పోకచెట్ల లేతమట్టలనడుమ చీల్చుకొని వెడలిన పుంబాళలు వాసనగొట్టగా ఆపరిమళమును ప్రాతఃకాలమారుతము విశేషముగాతీసుకొనివచ్చుచున్నది. కాబట్టి తేజఃప్రచురమైన శ్రీచక్రాయుధమును సుందరముగాను విశాలముగానుఉండు శ్రీహస్తమందు ధరించుకొని శ్రీరంగక్షేత్రమందు వేంచేసియుండు ఓ స్వామీ! నీదివ్య పాదములసేవను మే మనుభవించుటకై నీవు దివ్య నాగపర్యఙ్కమునుండి లేచి దాసభూతులమైన మా మీద కటాక్షమునుంచి కైఙ్కర్యవృత్తియందు నియమించి అనుగ్రహింపవలెను.

సావిత్రైర్ద్యుతిజాలకైః పరివృతందిఙ్మండలంతత్క్షణా న్నక్షత్రాణి నభాంతి కాంతిసహితా న్యజ్గోఽపి శీతాంశుమాన్ । సోఽభాత్యద్యతమోనిరస్త మభవచ్చాక్రీడవాటీలస త్పూగానోకహకణ్ణసంభవగళద్భృజ్గోచ రాజ్జాలకాత్ ॥ ౫ ॥ గంధోవాతితతః ప్రగేశిశిరయుఙ్మందానిలశ్చంచలః సంచారంకురుతేశ తార్క్ష్యసదృశస్ఫారత్ప్రభాభాసురం । చక్రంసుందరపాణిపంకజతలేబిభ్రన్నమాధీశభో రఙ్గాధ్యక్షశ్మపానిద్రాం సాశయనాదుత్థాయరక్షస్వనః ॥౬॥

మేట్టిళమేదికళ్ తళై విడుమాయర్కళ్ వేయ్ఙ్కుழలోశై యుంవిడై మణిక్కురలు
మీట్టియవిశై తిశై పరన్దనవయలుళ్ ఇరిన్దనశురుంబినమిలంగైయర్కులత్తై
వాట్టియవరిశిలై వానవరేఱే మామునివేళ్వియైక్కాత్తవబిరత
మాట్టియవడుతిఱలయోత్తియెమ్మరశే యరఙ్గత్తమ్మాపళ్ళియెழுన్దరుళాయే ౮

మేట్టిళ మేతికళ్ - గొప్పవైనమహిషములు ‌‌[లకులు
తళై విడుమాయర్కళ్ - బంధములనువదలు గోపా
వేయ్ఙ్కుழలోశైయుం - ఊదువేణునాదమును
విడై మణిక్కురలుం - వృషభములకంఠములయం
దుండు ఘంటాధ్వనులును
ఈట్టియవిశై - యివిఅంతయూ చేరినశబ్దము
తిశైపరన్దన - దిక్కులంతయూ వ్యాపించినవి
వయలుళ్ - పొలములయందుండు పుష్పముల
ఇరిన్దన - చెదరిపోయెను [యందు
శురుంబినం - తుమ్మెదలగుంపులు [లవంశమును
ఇలఙ్గైయర్కులత్తై - లంకయందుండు రాక్షసు
వాట్టియవరిశిలై - నిశ్శేషముగా నాశము జేసిన
శ్రీశార్ఙ్గాయుధముగల
వానవరేఱే - బ్రహ్మాదులకునుస్వామియైనవాడవు
మామునివేళ్వియై - విశ్వామిత్రునియజ్ఞమును
కాత్తు - రక్షించి
అవబిరతం - దీక్షాంతస్నానమును
ఆట్టియ - చేయించిన
అడుతిఱల్ - శత్రునాశకసామర్థ్యముగల
అయోత్తియెమ్మరశె - అయోధ్యా నాయకు
డైన మాస్వామియైన
అరంగత్తమ్మా - శ్రీరంగనాథస్వామీ
పళ్ళియెழுన్దు - నాగపర్యఙ్కమువిడిచి
అరుళాయే - కృపజేయుము.

సర్వలోకరక్షకుడైనఓస్వామీ! ఆశ్రితుడైననావిన్నపమునుఆలకింపవలయు; గొప్పశరీరముగలిగి బలముగలిగిన బాలమహిషీగణముల బంధములను గోపాలకులు వదలించి వెంబడించి పోవుచేండునప్పుడు వారు ఊదునట్టి వేణునాదమును వృషభముల కంఠమందుకట్టియుండు గంటలశబ్దమును ఎల్లదిక్కులయందును వ్యాపించియున్నదిగద, పొలములమధ్యమందుండు పుష్పసమూహముల మకరందమును కడుపారపానముజేసి తుమ్మెదలు ఝుంకారముజేయుచున్నవై చెదరిపోయినవి; గనుక దేవరవారికి తిరువారాధనకాలము ప్రాప్తమాయెను, పూర్వమందు లంకాపట్టణమున నివసించిన రాక్షసులవంశమును నిర్మూలముగ నాశముజేసిన శ్రీశార్ఙ్గాయుధమును దివ్యహస్తమందు ధరించినవాడై బ్రహ్మాదిదేవతులకు అధిపతియై వెలయుచున్న ఓ స్వామీ! విశ్వామిత్రునిజన్నమును మన్ననతోగాచి వారికి అవభృథస్నానమును గావించి శత్రువులనుజయించునట్టి పరాక్రమముగల అయోధ్యాధిపుడై రామచంద్రుడని పేరుగొన్న ఉభయవిభూతినాయకుడైన శ్రీరంగనాథా నీవుశేషపర్యఙ్కమునువిడిచి మమ్ము వీక్షించి దాసభూతులమైన మేముజేయు కైంకర్యమును అంగీకరించేవలయు.

పీనప్రోద్ధతబాలకాసరవధూరుస్సృత్యపశ్చాద్వ్రజద్గోపానాంమురళీరవశ్చ వృషభగ్రైవేయఘంటాధ్వనిః । వ్యాప్తస్సర్వదిగంతరాళమభితః కేదారపుష్పౌఘతో రోలంబాః ప్రవికీర్యయాన్తి సహసారుఘంకారశబ్దాన్వితాః ॥ ౭ ॥ లంకాకోణపవంశనాశకధనుర్భాస్వన్నమర్త్యాధిప ప్రీత్యాలప్సవర్యకౌశికమఖంనిర్వర్త్యతద్యోగినః । దీక్షాంతాప్లవకారకారిదశనాయోధ్యాపురీనాయక రఙ్గాధ్యక్షకృపానిధేశయనాదుత్థాయరక్షస్వనః ॥౮॥

పులంబినపుట్కళుంపూంపొழிల్ కళిన్వా య్పోయిற்றుక్కంగుల్ పుగుందదుపు
కలందదుకుణదిశైక్కనైకడలరవం కళివండుమిழற்றియకలంబకంపునైంద లరి
అలంగలంతొడైయల్ కొండడియిణైపణివాన్ అమరర్కళ్ పుకుందనరాతలిలమ్మా
ఇలఙ్గైయర్కోన్వழிపాడుశెయ్కోయి లెంబెరుమాన్పళ్ళియెழுందరుళాయే ॥౫॥

పులంబిన - ధ్వని జేసెను
పుట్కళుం-పక్షులు
పూంపొழிల్ కళిన్ వాయ్ - పూచిన తోటల[యందున్న
పోయిற்றుక్కంగుల్ - రాత్రితొలఁగిపోయెను
పుకుందదు పులరి-ప్రాతఃకాలము ప్రారంభించెను
కలందదుకుణదిశై-వ్యాపించెను, తూర్పుదిక్కున
కనైకడలరవం - ఘనమైనసముద్రఘోషము
కళివండు - మధుపానముచేమదించినతుమ్మెదలు
మిழற்றియ - ఝుంకరించుచున్న
కలంబకం - నానావిధపుష్పములచేత
పునైంద - కట్టబడిన
అలఙ్గల్ - కదలుచున్న
అంతొడైయల్ కొండు-సుందరమైన పుష్పమాలికలను పట్టుకొని
అడియిణైపణివాన్-స్వామివారి పాదసేవకొఱకు
అమరర్కళ్ - బ్రహ్మాదిదేవతలు
పుకుందనర్ - ప్రవేశించియున్నారు
ఆతలిలమ్మా - అందువల్ల ఓస్వామి
ఇలఙ్గైయర్కోన్-లంకానాథుఁడగు విభీషణుఁడు
వழிపాడు శెయ్కోయిల్ - కైంకర్యము జేయుచున్న దివ్యదేశమైన శ్రీరంగమునకు
ఎంబెరుమాన్ - నాయకుఁడైన ఓస్వామి
పళ్ళిఎழுందు - శేషపర్యఙ్కమునువిడిచి
అరుళాయే - కృపఁజేయవలయును.

ఆశ్రితపరాధీనుఁడైన ఓస్వామీ! దాసభూతులమైన మాయొక్క ప్రార్థనను చిత్తగింపవలయు; ప్రాతఃకాలమును సూచించు పుష్పతోటలయందుండు పక్షులు అంతటను అఱచుచున్నవి. లోకమంతయు నిండియుండు గాఢాంధకారము తొలఁగిపోయెను; తిరువారాధనమునకు యోగ్యమగు ప్రభాతకాలము ప్రాప్తమాయెను, తూర్పుదిక్కునఅగుపడు స్వాభావికముగ మొఱబెట్టుచుండు సముద్రఘోషము జగమంతయువ్యాపించినది. మధుపానముచే మత్తమగుతుమ్మెదలు ఝుంకారముచేయుచున్న నానావిధపుష్పములచేకట్టబడిన దివ్యపరిమళయుక్తమగుమాలికలను తమ హస్తములందుపట్టుకొని బ్రహ్మాదిదేవతలు దేవరవారిపాదసేవకుగాను దివ్యసన్నిధానమందు నిరీక్షించుచున్నారు గనుక సర్వస్వామ్యత్వరుఁడైన ఓస్వామీ! లంకాధిపతియైన శ్రీవిభీషణునిచే కైంకర్యమునుపొందియుండు శ్రీరంగమునవిజయముచేసియుండుస్వామీ! నాగపర్యఙ్కమునువిడిచి కృపచేమమ్ము కటాక్షించి మేముచేయు కైంకర్యమును అంగీకరింపవలయు.

పుష్పాఢ్యోపవనేశకున్తనివహాస్సంరావమాకుర్వతే । యాతం నైశతమః ప్రభాతసమయశ్చావిర్బభూవాధునా ॥ పారావారరవోఽపి పూర్వకకుభివ్యాప్తస్సమన్తాద్ధ్రుతం । షట్పాదా మధుపానలోలుపతయా భ్రామ్యన్తిగాయన్తిచ ॥ నానాపుష్పనుబద్ధలోలవిలసత్స్రగ్జాలమావృత్య తే । దేవాశ్చాయయురత్రతన్మమవిభో లఙ్కాధినాథాత్కృతాం ॥ అర్చాం ప్రాప్యవిచిత్రరత్నఖచితే హర్మ్యేశయానాద్యభో । రఙ్గాధ్యక్షకృపానిధేఽత్తిష్ఠ శయనాదుత్థాయరక్షస్వనః ॥౧౦॥

ఇరవియర్ మణినెడుం తేరొడుమివరో ఇఱైయవర్ పదినొరువిడైయరుమివరో
మరువియమయిలిననఱుముకనివనో మరుతరుంవశుక్కళుంవందువందీండి
పురవియోడాడలుంపాడలుం తేరుం కుమరదండంపుకుందీండియవెళ్ళ
మరువరైయనైయనిఱ్కోయిల్ మున్ని వరోఅరంగత్తమ్మాపళ్ళియెళ్ళుందరుళాయే ౭

ఇరవియర్ - ద్వాదశాదిత్యులు
మణినెడుం తేరొడుం - సుందరమై పొడవైనరథ ములతోడను
ఇఱైయవర్ - లోకనిర్వాహకులైన
పదినొరువిడైయరుంఇవరో - ఏకాదశరుద్రులు
మరువియ - ఎడతెగకఎక్కియుండు
మయిలినన్ - మయూరవాహనముగల
అఱుముకనివనో - ఈషణ్ముఖుడును
మరుతరుం - నలువదితొమ్మిదిమరుద్గణమును
వశుక్కళుం - అష్టవసువులును
వందువందీండి - వచ్చివచ్చిడగ్గరించి
పురవియోడు - గుఱ్ఱములతోడను
ఆడలుంపాడలుం - నృత్యగీతాదులు
తేరుంకుమరదండం - రథములు,కుమారసైన్యము
పుకుందీండియ - ప్రవేశించినిలిచియున్న
వెళ్ళం - గొప్పగుంపు
అరువరై అనైయ - మేరువునకుసరిపోలిన
నిఱ్కోయిల్ - దేవరవారిసన్నిధియొక్క
మున్నివరో - ముందునిలచియున్నారు
అరంగత్తమ్మా - శ్రీరంగనాథస్వామి
పళ్ళిఎళ్ళుందు - నాగశయనమునువిడిచి
అరుళాయే - కృపచేకటాక్షించుము.

ఓపరాత్పరుడైనస్వామీ! దేవరవారిసన్నిధిలో వినయపూర్వకముగ విజ్ఞాపనము చేసుకొనియెద. ఆలకింపవలయు, సుందరమగు గొప్పరథములుగల ద్వాదశాదిత్యులును,లోకనిర్వాహకులగుఏకాదశరుద్రులును,ఎడతెగకయెక్కినమయూరవాహనముగల కుమారస్వామియు,నలువదితొమ్మిదిసంఖ్యగల మరుద్గణమును,అష్టవసువులును, వీరందఱును సపరివారముగ త్వరలో వచ్చి చేరినారు. ఇదిగాక వీరితో వచ్చిన గుఱ్ఱములును రథములును, నృత్తగీతాదులతో కూడిన కుమారస్వామియొక్క నిబిడమగు సైన్యమును, మహామేరువునకు సరిబోలిన దేవరవారి సన్నిధిముందట ప్రథమ వీక్షణమునకుగాను గుంపుగుంపుగ నిలచియుండినందున శ్రీరంగక్షేత్రమునందు యోగనిద్రజేయుచున్న ఓరంగనాథా! నాగపర్యఙ్కమును విడచి లేచి వీరందఱిని కటాక్షింపవలయు.

రత్నస్యూతరథైర్యుతాశ్చరవయోరుద్రాస్తథైకాదశ । ప్రాప్తాస్సన్తతవాహనాయితశిఖీ షడ్వక్త్రకోప్యాగతః ॥ లోకత్రాణవిచక్షణాశ్చమరుతస్సర్వేవసూనాంగణోఽ । ప్యేతైస్త్యాశ్వగణైస్తథాపరిజనైస్తౌర్యత్రికంకుర్వతే॥౧౧॥కౌమారంబలమప్యుపేత్యసరథంవ్యూహీకృతంతిష్ఠతి, త్వామ్యభ్రాజిసువర్ణశైలతులితప్రోత్తుంగశృంగస్యతే ॥ హర్మ్యస్యోత్తమభర్మకర్మరచితస్యాగ్రే నిరీక్ష్యస్థితాః । రఙ్గాధ్యక్షకృపానిధేఽహిశయనాదుత్థాయరక్షస్వనః ॥౧౨॥

అందరత్తమరర్ కళ్ కూట్టంగళ్వైయో అరుంతవముసివరుమరుతరుమివరో!
ఇందిరనానైయుం తానుంవందివనో యెంబెరుమానున్ కోయిలిన్ వాశల్
శుందరర్ నెరుక్క-విచ్చాదరర్ నూక్క- ఇయక్కరుంమయజ్ఞినర్ తిరువడిత్తొళువాన్
అందరంపారిడమిల్లైమత్ త్రీతువో వరంగత్తమ్మా పళ్ళియెళుందరుళాయే॥ ౯।

అందరత్తమరర్ గళ్ - అండాంతర్వర్తులైన దేవతులు
కూట్టంగళివైయో - వీరిపరివారములు
అరుంతవమునివరుం - అద్భుతతపోనిష్ఠులైన సనకాదిమునులు
మరుతరుమివరో-దేవతలగుంపు
ఇందిరనానైయుం - ఐరావతమును
తానుం - ఇంద్రుడును
వన్దివనో - వచ్చేటగాక
ఎంబెరుమాన్ - మాకుస్వామియైన
నిన్కోయిలిన్ వాశల్ - దేవరవారి సన్నిధివాకిట
శుందరర్ నెరుక్క - గంధర్వులునుగ్గుచేనుండ
విచ్చాతరర్ నూక్క - విద్యాధరులు తోయగా
ఇయక్కరుం - యక్షులు
మయజ్ఞినర్ - స్తబ్ధులైనిలిచినారు
తిరువడిత్తొళువాన్ - దేవరవారిపాద సేవకు
అందరం పార్ - ఆకాశభూములయందు
ఇడంఇల్లై - స్థళములేకయున్నది
మత్రుతువో - మఱియునిచ్చేట
అరంగత్తమ్మా - ఓరంగనాథా
పళ్ళియెళుందు - నాగతల్పమునువిడిచిలేచి
అరుళాయే - కృపజేయుము.

శ్రీవత్సాంకుండైన ఓస్వామీ! దాసభూతుండైన నామనవి ఆలకింపవలయు, మాకు స్వామియైన దేవరవారి సన్నిధివాకిట త్రిలోకాధిపుండైన ఇంద్రుండు, వానికి వాహనమైన ఐరావతము నిలచియుండుటగాక, అండాంతర్వర్తులైన దేవతాసమూహము, వారివారిపరివారములు, అపూర్వతపోనిష్ఠులైన సనకాదిమహామునులు, మరుద్గణములు, మీసేవకుగాను కాచుకొనియున్నారు. ఈసంఘమునందు గంధర్వులు చొరంబడుచుండగా, విద్యాధరులకు అవకాశము లేనందున వారినిబదులుగ తోయుచు న్నారు. యక్షులు వీరినిచూచి స్తబ్ధులై నిలచియున్నారు; దేవరవారి విశ్వరూప సేవను విలోకించి దివ్యశ్రీ పాదార్చనగావించి మంగళాశాసనముం జేయవలెనను కుతూహలముచే ఒకరిమీదనొకరుచొరంబడి ఆకాశభూమ్యంతరాళములయందు ఎచ్చటనుకొంచెమైననవకాశము లేక నిలచియున్నారు; గాన శ్రీరంగక్షేత్రమునందు నాగపర్యఙ్కమున శయనించియుండు ఓస్వామి! తాముపానుపువిడిచి లేచి ఆశ్రితులైన వారికి దర్శనమిచ్చి కృపంజేయవలయు.

అండాన్తర్గతదేవతాగణయుతా హ్యేతేమహాతాపసాః । శక్రస్స్వయమతజ్జ జేన మరుతాం సంఘేన చాగాద్ధ్రితం ॥ అస్మన్నాయకయుష్మదీయసదన ద్వారే తు విద్యాధరాః । సంఘీభూయ విశన్తిమంగళరవాన్తే గానవిద్యారతాః ॥ ౧౩ ॥ గన్ధర్వాగణశో మిళంతిసహసా యక్షాశ్చనిశ్చేష్టకాః ॥ త్వత్పాదాబ్జసమర్చనాయ మిళితైస్తైస్తైశ్చ పూర్వోదితైః ॥ రోధోంతఃకుహరం ప్రపూరితమభూన్నాస్త్యంతరన్త్రత్రభో । రఙ్గాధ్యక్షకృపానిధే ఽహిశయనాదుత్థాయరక్షస్వనః ॥ ౧౪ ॥

పంబవిశ్ఱ్ వానవర్ వాయుఱైవళ్ఙ్గ మానిదికపిలై యొణ్ కణ్ణాడిముదలా।
ఎంబెరుమాన్ పడిమైక్కలం కాణ్డఱ్ కేఱ్ పనవాయినకొండునన్ మునివర్
తుంబురునారదర్ పుహుందనరివరో తోన్ఱిననిరవియుమ్ తులంగొళిపరప్పి
అంబరతలత్తినిన్ఱకల్ కిన్ఱతిరుళ్ పోయ్ అరంగత్తమ్మా పళ్ళియెழுందరుళాయే. ౧౦

| | |
|---|---|
| పంబవిశ్ఱ్ - నవీనపరిమళముగల | తుంబురునారదర్ - తుంబురులు నారదులు |
| వానవర్ - దేవతులు | పుహున్దనర్ ఇవరో - ప్రవేశించి ఇచ్చేటనిలిచినారు |
| వాయుఱై - గఱికకసువు | తోన్ఱినన్ ఇరవియుం - ఉదయించెను సూర్యుడు |
| వళ్ఙ్గ - సమర్పించేటకై | |
| మానిది - శ్లాఘ్యముగు శంఖాదినిధులును | తులంగొళిపరప్పి - అధికమైన తేజస్సును విస్తరించి |
| ఒణ్కణ్ణాడిముతలా - మణిదర్పణము మొదలైనవి | అంబరతలత్తిల్ నిన్ఱు - అంతరిక్షమునుండి |
| ఎంబెరుమాన్ - సర్వస్వామియైన నీవు | అకల్కిన్ఱతు - తొలగుచున్నది |
| పడిమైక్కలం - ఉపకరణములన్నియు | ఇరుళ్ పోయ్ - అంధకారము వెలువడి |
| కాణ్డఱ్కు - దర్శించి అనుగ్రహించేటకు | అరంగత్తమ్మా - ఓ శ్రీరంగనాథా |
| ఏర్పనవాయిన - తగినటువంటి | పళ్ళియెழுందు - నాగశయనమును వదలి |
| కొండునన్మునివర్ - తీసుకొనివచ్చిన గొప్పమునులు | అరుళాయే - కృపఁజేయుము. |

సర్వరక్షకుఁడైన ఓస్వామీ! నా ప్రార్థనను చెవిగొనుము, దేవరవారి ఆరాధన యోగ్యమగు ప్రాతఃకాలము సన్నిహితమాయెను; తమకుగాను సమర్పించేటకు నూతనపరిమళముగల గఱికకసవులును శ్లాఘ్యమైన శంఖాది నిధులును వీటిని తీసుకొని సర్వస్వామియైన మీసుప్రభాతసేవకుగాను కపిలవర్ణగోవులు, నిర్మలమగు మణిదర్పణములు, మొదలగు సర్వోపకరణములను సిద్ధపఱచుకొని దేవతులు, అనన్యప్రయోజకులైన మహామునులును, దివ్యగానము చేయు తుంబురునారదులును, సమయనిరీక్షణము చేయుచు కాచియున్నారు; వీరుగాక సహస్రకిరణములుగల సూర్యుడును తన దివ్యతేజస్సును భువనమంతయు వ్యాపింపజేయుచు వెలుగుచున్నాఁడు. అంధకారమంతయు తొలఁగిపోయెను; గనుక ఓ శ్రీరంగనాయకా దేవరవారు నాగపర్యఙ్కమును విడిచి మేల్కొని, తెచ్చియుండు ఈపదార్థములనీక్షించి దాసభూతులమైన మమ్ము కృపచే అజ్ఞానాంధకారమునుండి తొలగించేవలయునని ప్రార్థించుచున్నారము.

దేవైర్నవ్యసుగన్ధబంధురలసద్దూర్వాఙ్కురాసోఽమలా। స్స్వప్నత్పాదసమర్పణాయసుహ్యతా సంగీకురుష్వాధునా॥ పద్మాదీంశ్చనిధీం స్తథైవకపిలాం గాంచాహరన్మంగళా। మాదర్శాదికమత్రసిద్ధమభవ త్స్వామిన్ జగన్నాయక ॥ ౧౫ ॥ వీక్షస్వాఖిలమీక్షణీయమథతే వాచంయమాశ్చాహరే। న్నేతౌతుంబురునారదావవిశతాం భానుః ప్రకీర్యప్రభాః॥ ఆవిర్భావమగాద్దివోవిగళితం గాఢంతమోమండలం। రఙ్గాధ్యక్షకృపానిదేఽహిశయనా దుత్థాయరక్షస్వనః॥౧౬॥

ఏదమిల్ తణ్ణుమైయెక్కమ త్తళి యాళ్ కుళల్ ముళవమోడిశై తిశై కెళుమి।
కీదంగళ్ పాడినర్ కిన్నరర్ కరుడర్ కళ్ కందరువరుమివర్ కంగులుమెల్లాం।
మాదవర్ వానవర్ శారణరియక్కర్ శిత్తరుమయఙ్గినర్ తిరువడిత్తొళువాన్।
ఆదలిలవర్కునాళోలక్కమరుళ వరంగత్తమ్మా పళ్ళియెళుందరుళాయే॥ ౧౦॥

ఏదమిల్ తణ్ణుమై - నిర్దోషమైనతప్పెట
యెక్కం మత్తళి- ఏకతంత్రీవాద్యము,మృదంగము
యాళ్కుళల్ - ఒకవిధమైనవీణ, పిల్లగ్రోవి
ముళవమోడు - ఈవాద్యములతో చేరిన
ఇశై - గానమును
తిశై కెళుమి - దిక్కులంతయువ్యాపించేనట్లు
కీదంగళ్ పాడినర్ - గీతాలాపముఁ జేయుచున్న
కిన్నరర్ కరుడర్ కళ్ - కిన్నరులు గరుడులు
కందరువరుం ఇవర్ - ఈగంధర్వులే మొదలుగా
కంగులుంఎల్లాం-రాత్రివేళయందును [మే]లవారలు
మాదవర్ - మహాతపస్వులైనఋషులు

వానవర్ - వేల్పులును
శారణర్ - చారణులును
ఇయక్కర్ - యక్షులును
శిత్తరుం - సిద్ధులును
మయఙ్గినర్ - తాఱుమారైనిలచినారు[ను]
తిరువడిత్తొళువాన్ - దేవరవారిపాదసేవకుగా
ఆదలిల్ అవర్కు - గనుకవారికి
నాళ్ ఓలక్కం అరుళ - నేడుకొలువునకుగాను
అరంగత్తమ్మా - శ్రీరంగధామా
పళ్ళిఎళుందు - పడకవిడిచిలేచి
అరుళాయే - కృపఁజేయుము.

లోకములకంతయు కర్తయగు ఓస్వామీ! దేవరవారిసన్నిధానమందు విన్నవించెద, కృపచే ఆలకింపవలయు, దేవరవారు యోగనిద్రనుండి మేల్కొను వేళ మంగళశబ్దములను మీస్తోత్రములువినవలయు గనుక నిర్దోషమగు తప్పెట ఏకతంత్రీవాద్యము మృదంగము వీణ వేణు వీటిశబ్దములతో కూడిన గీతధ్వని దిక్కులంతయువ్యాపించేరీతిగ మంగళగానముతో పాడుచున్న కిన్నరులు, గరుడులు, గంధర్వులు, రాత్రికాలమందుతపస్సుచేయు ఋషులును, చారణులును, యక్షులును, సిద్ధులును, వీరందఱును దేవరవారిపాదసేవకుగాను త్వరగాని నిలచియున్నారు. గనుక శ్రీరంగ దివ్యక్షేత్రమందు నాగపర్యఙ్కముపై శయనించియుండు ఓజగదీశా! నేటి దినంబున కొలువుకూటముజేసి వారందఱకున దర్శనమిచ్చుటకై మేల్కొని దాస వర్గమునకు కైంకర్యవృత్తినినియమించి ఆకైంకర్యమును అంగీకరింపవలయు.

నిస్సామ్యాఃపటహానిరర్గళరవా స్తాశ్చైకతంత్ర్యోల్లస । చ్ఛబ్దోద్భోధకరామృదఙ్గతతయ స్సారంగవేణ్వాదయః॥ ఉద్ఘోషాన్ప్రచయంతితైస్సహయుతా గీతిర్దిగన్తంగతా। గీతానాలపతీహకిన్నరగణో గన్ధర్వబృందంచతత్ ॥౧౭॥ నక్తంచాపితపోయుతామునివరా దేవాస్సయక్షాస్తథా । సిద్ధాశ్చారణసంయుతాశ్రమజుష స్త్వత్పాదసేవాకృతే॥ తస్మాదద్యభవాన్కరోతుకరుణా మాస్థానగోష్ఠీముఖే। రఙ్గాధ్యక్షకృపానిధే శయనా దుత్థాయరక్షస్వనః॥౧౮॥

కడిమలర్క్కమలంగళ్ మలర్ందనవివై యో కదిరవఙ్ కనైకడల్ ముళైత్తననివనో
తుడియిడై యార్ శురికుళల్ పిళిందుదఱి తుకిలుడుత్తేఱినర్ శూళ్ పునలరంగా
తొడైయొత్తతుళబముంకూడైయుంపొలిన్దుతోన్ఱియతోళ్ తొండరడిప్పొడియెన్నుం
అడియనై యళియనెన్ఱరుళియున్నడియార్ క్కాట్పడుత్తాయ్ పళ్ళియెళుందరుళాయే॥

కడిమలర్క్కమలంగళ్ - పరిమళముగలకమలములు
మలర్ందనవివై యో - ఇవివికసించినవి
కదిరవఙ్ - సూర్యుడు
కనైకడల్ - మిక్కిలిశబ్దముగలసముద్రమునుండి
ముళైత్తనఙ్ ఇవనో - ఆవిర్భవించెను
తుడియిడై యార్ - కృశమధ్యదేశముగల స్త్రీలు
శురికుళల్ - కుటిలచికురములను
పిళిందుదఱి - పిండెవిదిలించి
తుకిలుడుత్తు - వారివారివస్త్రములను ధరించి
ఏఱినర్ - గడ్డనుఎక్కిరి [రంగాధ్యక్షుఁడా
శూళ్ పునల్ అరంగా - కావేరిచేపరివేష్టితమగు

తొడైయొత్తతుళబముం - కట్టిన తులసి మాలిక
కూడైయుంపొలిన్దు - బుట్టతో చేరిన [నుగల
తోన్ఱియతోళ్ - కనుబడుభుజముగల
తొండరడిప్పొడియెన్నుం - తొండరడిప్పొడియని పేరుగల
అడియనై - దాసుడైననన్ను
అళియఙ్ ఎన్ఱరుళి - అనాథుడనికృపఁజేసి
ఉన్నడియార్క్క - నీదాసులకు
ఆళ్ పడుత్తాయ్ - దాసునిగాఁజేయుము
పళ్ళియెళుందు- నాగశయనమువిడిచిమేల్కొని
అరుళాయే - కృపఁజేయుము.

మహాపుణ్యానదియైన కావేరిచేపరివేష్టితమైన శ్రీరంగక్షేత్రమందు విజయము చేసియుండు ఓ జగత్పతీ! నాప్రార్థననువినుము. దివ్యపరిమళభరిత కమలములు వికసించినవి; ఈ కమలమిత్రుఁడైన సూర్యుఁడు ఘోషించుచున్న సముద్రమునుండి వెడలియున్నాఁడు, తనుమధ్యలైన స్త్రీలు స్నానముజేసి తమ కుటిలకుంతళములను పిండుకొని విదిలించి వలువలనుగట్టుకొని గడ్డకెక్కిరి. ఈలాగు ప్రభాతసూచకమైన కార్యములు అంతటవ్యాపించియున్నవి గనుక కట్టినతులసీమాలికచే ప్రకాశించు పుష్పబుట్టచే అలంకృతభుజముగల తొండరడిప్పొడియని పిలవబడు నీదాసుఁడైన నన్ను అనాథుఁడనితలచి నీదాసులకుదాసునిగాచేయవలయు. ఇందుకుగాను నాగ పర్యఙ్కమువిడిచి లేచి కృపచే కటాక్షింపుము.

ఆమోదావహపఙ్కజాతనివహా న్యాసన్వికాసన్గతా । న్యర్కాశ్చాప్యతిఘోరగర్జనవత స్సింధోర్బహిర్నిర్గతః । తన్వ్యస్నాత్మ్యవలగ్నవక్రచికురా స్స్నాత్వాకచాన్విద్యచో । ధృత్వాచేలయాతాయయుర్భ్రమియాత్తై స్సహ్యాద్రికన్యాజలైః ॥ ౧౯ ॥ వీతేరఙ్గపురేస్థితాఖిలపతే త్రాశస్య మాలైర్యుతాం । రమ్యాం పుష్పపుటీంభుజే ప్రకలితం భక్తాఙ్ఘ్రిరేణ్వాహ్వయం ॥ దాసంనిర్గతికంస మీక్ష్యభవతో దాసానుదాసంకృథాః।రఙ్గాధ్యక్షకృపానిధే ఽహిశయనాదుత్థాయరక్షస్వనః।౨౦।